# ద్వితీయ ప్రకరణము

## హిందూదేశము పేరెట్లువచ్చినది?

ఆదిలో హిందూదేశములోని మతమునే హిందూమతమని గూడ పిలచియున్నట్లు కనబడుచున్నది. ఈ హిందూమతములో ప్రధాన శాఖలు మొట్టమొదట ననగా క్రీస్తు పూర్వము 7800 సంవత్సర ప్రాంతములో శైవ, వైష్ణవ మతములై యుండెను. విష్ణువునే మొదట హిందువని హిందూమూర్తి యని పిలిచెడివారనియు, నాతని మతమును, దేశమును హిందూనామములు ధరించినట్లును విష్ణుమాయోత్తర ఖండములో వ్రాయబడినది. కాని యిది విష్ణుభక్తులలో నెవరిచేతనో కల్పింపబడినట్లు కనబడుచున్నది. ప్రజాపతులు కొందరును, స్వాయంభువ మనువును మొదట మనదేశమునకు వచ్చినపుడు, వారిలో నొకశాఖ వారిని ఇంద్రుడను నతడు పాలించువట్లేర్పాటు చేసుకొనిరి. ఇంద్రుడనగా శ్రేష్ఠుడని యర్థము. ఈ యింద్రుడు అమరావతిలో తన స్థానమునుంచి పాలించెను. ఇది మొదట త్రివిష్టపమున (తిబెట్టు) నుండి క్రమముగా నచటికి మారెను.

అప్పటినుంచి యా ప్రదేశము ఇంద్రుని రాజ్యమయ్యెను. ఈ యింద్ర పదమే పామరులనోటను హిందూరాజ్యమయ్యెనని తలంచుట కవకాశ మున్నది. అచట ప్రవహించుచుండిన యొక నదినిగూడ యా పేరటనే ఇంద్రనదియని మొదట బిలుచుచు ఇంద్రునితో లేక ఇంద్రరాజ్యముతోగూడి స + ఇంద్ర = సింద్రనదియై క్రమముగా సింధునది యయ్యెనని గ్రహించుట యుక్తము. వరుణా, బ్రహ్మపుత్రనదులుగూడ యిట్లేర్పడిన నామములే. పాశ్చాత్యుల నోటబడి సింధుయే హిందుయయ్యెనని కొన్ని పూర్వవ్రాతలు కలవు గాని వానికి విరుద్ధముగ అర్థమేదియైనను మొదటిపదమే "హిందు" అని పైననుడివిన విష్ణుమాయోత్తరఖండము నుడువుచున్నదిగదా! అందుచే వాని

(1) 'పురాణ మితి ఏవ వసాధు సర్వమ్
నచ అపిసర్వమ్ నవమితి అవద్యమ్'



యర్థము తర్వాత కల్పింపబడినట్లు మనము గ్రహింపగలము. ఇంద్రుడు గూడ విష్ణువునకు లోబడిన వాడగుటవల్ల నాతని యంశము గల యింద్రునకుగూడ (నృపాలురందరట్టి యంశము కలవారేయను ప్రమాణమును బట్టి) యీవిధముననే యీ పేరు తర్వాత వచ్చియుండెనేమో! విష్ణుని భార్య శ్రీదేవిని ఇందిరయని పిలుచుటగూడ నుండెను. హిందూశబ్దము మొదట ఎటు పుట్టినను విష్ణునామమునగా నేర్పడిన నాటినుండి, యాతని భార్యకు ఇందిరయను నామము వచ్చినట్లు కనబడుచున్నది. ఇంద్రపదము మనదేశమున కార్యులు రాకపూర్వమే ఇండోయైరేయనుల కాలములోననగా ఇరానులోను, ఇండియాలోను ఏకజాతివారు నివసించు కాలముననే వచ్చియుండును-దానినిబట్టియే మనదేశ నామమేర్పడెననియు, నట్లేమతమునకు వచ్చెననియు గ్రహించుట యుక్తము. ఇండోయైరేయనుల కాలము క్రీ. పూ. 7800 సం॥ల నుండి యున్నట్లు మన లెక్కలవల్ల తేలుచున్నది.

## స్వర్గ, మర్త్య, పాతాళములు

ఈ హిందూదేశములోని హిమాలయ ప్రాంతము మొదలు అమరావతి ప్రాంతము వరకు స్వర్గలోకము లేక రాజ్యమనియు బ్రహ్మావర్తమనియు తర్వాత పేర్వడసెను. దానికి దక్షిణరాజ్యము మర్త్యలోకమనియు లేక మనుసంతతి మానవ రాజ్యమనియు బ్రఖ్యాతి గాంచెను. దానికి దక్షిణముగా దండకారణ్యము దాటినపిమ్మట గల ప్రదేశము పాతాళలోకము లేక రాజ్యమనియు బేరొందెను. ఈ మూడింటినే విభజించి పదునాలుగు లోకములుగా గూడ జెప్పియుండిరి. ఉపనిషత్తులలో గొన్నిటియందు అంతరిక్ష, వాయు, భూలోకములని మూడుగా విభజింపబడినవి. గాని భూలోక విభజనము లేదు. మూడవరాజ్యభాగమగుటవల్లనే అందలివారికిని స్వర్గమునకు త్రిదశులనియు, త్రిదివమనియు వరుసగా పేర్లు వచ్చెను. బ్రహ్మావర్తము దేవత లేర్పరచినదనియు, నందు కురుక్షేత్ర, మత్స్య, కన్యాకుబ్జ, మధురాది దేశము లున్నట్లును, దీనికి తూర్పుగా వింధ్య హిమాచలముల మధ్య సరస్వతీ ప్రయాగ నదులవద్ద మధ్యదేశమున్నట్లును దీనికి తూర్పు పూర్వ పశ్చిమసముద్రముల మధ్యప్రదేశమార్యావర్తమనియు మనుస్మృతిలో గలదు.